రము పొందును. రసాత్మక మయిన యనుప్రవేశమున సంచారము కలదగును గాన నా యవస్థ రసరూపత్వము పొందున దగును. నాటకమున విధీయమాన మగుట సంపాద్యమాన మగుట సర్వము రసరూపతానయన ముద్బోధించును. నాటకము నందుపనిబద్ధము లగునవి యన్నియు రసావస్థానములగుట మొదట నిరూపితమె. జ్ఞానము శిల్పము విద్యకల కర్మయోగము సర్వము నాట్యము నందున్నది. ఇందు లేనిది లేదు. నానావస్థాంతరాత్మక మయిన లోకస్వభావ మంగాద్యభినయ యుక్తమె నాట్యమగు ననుటయు నిరూపిత మయినది. దేవతలు ఋషులు రాజులు మేధావులు వీరందరి పూర్వవృత్తానుచరితమె నాటక మగును. పూర్వవృత్తానుచరితము నాటకశబ్దార్థ మెట్లగునను కొందరు కాబోలు. ఇదిగో!

౫౫౨. యస్మాత్స్వభావం సంత్యజ్య సాంగోపాంగ గతిక్రమైః
ప్రయుజ్యతే జ్ఞాయతే చ తస్మాద్వై నాటకం స్మృతం.
౫౫౩. సర్వభావైః సర్వరసైః సర్వకర్మప్రవృత్తిభిః
నానావస్థాంతరోపేతం నాటకం సంవిధీయతే.

ప్రయోక్తలు ప్రయోగసమయమున లోకసిద్ధమయిన స్వభావమును విడనాడి సాంగోపాంగము లయిన గతిక్రమములతో ప్రయోగము నిర్వహింతురు గాన నిది నాటక మయినది. "నట నతౌ" అని ధాతువు. తదర్థము నమనము. స్వభావత్యాగమున ప్రహ్వీభావముతో నుండుట నాటకపదార్థమున గోచర మగును. సర్వభావములతో సర్వరసములతో సర్వకర్మప్రవృత్తులతో నానావస్థాంతర సముపేతముగా నాటకసంవిధాన మున్నది. ఇట్టి దీని నిర్మాణమునకై కవి యతించిన కృతి యగును. లోకస్వభావము చూచి నరుల బలాబలములు గుర్తించి వారి యంగ రంగ భోగ రాగములు తెలిసి యుక్త లుక్తులు పట్టి నాటకమును నిర్మింప వలెను,

౫౫౪ భవిష్యతి యుగే ప్రాయో భవిష్యంత్యబుధా నరాః
యే చాపి హి భవిష్యంతి తే యత్నశ్రుతబుద్ధయః

౫౫౫ కర్మశిల్పాని శాస్త్రాణి విచక్షణబలాని చ
సర్వాణ్యేతాని నశ్యంతి యథా లోకః ప్రణశ్యతి.

౫౫౬ తదేవం లోకభాషాణాం ప్రసమీక్ష్య బలాబలం
మృదుశబ్దం సుఖార్థం చ కవిః కుర్యాత్తు నాటకం

రానున్న కాలమున మానవు లందరు సామాన్యముగా నబుధు లగుదురు. వారును యత్నశ్రుతబుద్ధులు. యత్నమున విందురు బుద్ధులు సంపాదింతురు. కర్మలు శిల్పములు శాస్త్రములు పరిశీలనములు బలములు సర్వవిశేషములు నష్టప్రాయము లగును. అప్పుడు లోకమె నష్ట మగును. కాన నా సమయమున లోకభాషల బలాబల రీతుల గుర్తించి కవి మృదుశబ్దముగా సుఖార్థముగా నాటకమును నిర్మింపవలెను. త్రేతలోని యీ మాట ద్వాపర కలియుగ విశేషములను సూచించు చున్నది. ఆ యుగములందు కర్మశిల్పాదులె నశించు ననుట కాదు. ఈ వచనము సమస్తనాట్యాంగోపలక్షణము. అప్పుడు కవి నిర్మింపవలయు ననుట కవిపర మయిన యుపదేశము కాని నటులు ప్రయోగింతురు. సహృదయులు తెలియుదురు గావున వారలకును స్వభావపరిత్యాగపురస్సర మయిన నమనము సంభావనాకృత మయిన యౌచిత్యానుసారమున చెప్పదగియె యున్నది.

౫౫౭. చేక్రీడితాద్యైశ్శబ్దైస్తు కావ్యబంధా భవంతి యే
వేశ్యా ఇవ న తే భాంతి కమండలుధరై ర్ద్విజైః

చేక్రీడితము మొదలయిన వైయాకరణ గ్రామ్య శబ్దములతో కావ్యబంధము లుండునేని కమండలువులు ధరించిన ద్విజులతో వేశ్య లున్నట్లు రమణీయముగా నుండవు. రసభావోచితము లయిన శబ్దముల సంపత్తి యుండవలయు ననుట యిందలి యుపదేశము. ఇప్పటికి నిరూపించిన దంతయు దశరూపవిధానము. కవిప్రతోక్తు లనుసరింప దగిన విశేషములు సవిశేషముగా నిరూపితము లయినవి. ఈయుక్త సంవిధానసహితాత్మ కథావిస్తృతికి రసభావఘటన [illegible] ముపయోగించు ననుట పూర్వోక్త మయిన [illegible] చున్నది.